REG. NM.o. 2155

REG No. N45

The First Telugu Bi-weekly in Andra Desa, The only Telugu News Paper for H. E. H The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు—దక్కను

GOLAKONDA PATRIKA HYDERABAD Dn

సంపుటము ౫ | ప్రమోదూత నామ సంవత్సర పుష్య బ॥ ౧౪ శనివారము 17-1-31 | సంచిక ౬౭

## బాలికా పాఠశాలల దుస్థితి

### ప్రభుత్వమువారు చేయుచున్న సహాయము

దయామయులును, విద్యాప్రియులును, అగు ప్రభుత్వమువారు స్త్రీవిద్యకై ధనము వెచ్చించుచున్నారు కాని బాలికలు విద్యావంతురాండ్రగుట లేదు

దేశమునందు విద్య బాగుగ వ్యాపింప వలయునన్న బాలురవలనే బాలికలకుకూడ నిర్బంధ ప్రాథమిక విద్య అమలులో నుంచవలయును ప్రాథమిక విద్య స్వభాషయందే గఱపవలయును

(ఒక నారీమణి)

మహాఘనత వహించిన శ్రీనిజాం ప్రభువువారు దయామయులై స్త్రీవిద్యాభిమానముగలవారై వేనవేలు వెచ్చించి ప్రతిగ్రామమందును బాలికా పాఠశాలలు నిర్మింపజేసిరి చిరకాలమునుండియు సూర్యరశ్మినైనఁగనక గోషాకులమున బుట్టిన మహమ్మదీయ స్త్రీలు విశేష విద్యావంతులగుచుండిరి. పెద్దపెద్ద ఓహదేదార్లగు మహమ్మదీయ సోదరులు తమ సతీతిలకముల సభలకు నిరాఘాటముగ బంపుటకును సభాధ్యక్షత వహించుటకు నంగీకరించిరి కేవలము గోషాకులమున బుట్టి పెరిగి గొప్పగొప్ప యధికార పదవులందున్న మహమ్మదీయ సోదరీమణులు సభాధ్యక్షత వహించుట జూడ నిజాంరాష్ట్ర స్త్రీలోకమునకు భావికాల శుభసూచనయేగాని ప్రతివ్యక్తికిని దేశసేవా సక్తియు, ఉన్నత విద్యయు పూర్తిగ మూర్తీకరింప లేదు స్త్రీవిద్యా వ్యాప్తియు ఇప్పుడిప్పుడు అక్కడక్కడ చిగురించుచున్నదిగాని శాఖోపశాఖలుగ వ్యాపింపజాలకున్నది [illegible] విద్యయొక్క విలువ తెలిసి లేదు. ఈకారణమున విద్యయందభిరుచి కలుగలేదు అభివృద్ధి [illegible] ఉపాధ్యాయునిల [illegible] బాలికా పాఠశాలల నేర్పఱచిరని శిశుపోషణాది కార్యములు స్త్రీలవలననే జరుగుచున్నవి. బాలురు, బాలికలుకూడ వ్యక్తురాండ్రని చాలమంది జనులు భావించుచున్నారు ఇందుచేత దమ పిల్ల లల్లరిచేసి నప్పుడును, తమకు గృహముల బనిపాటలు లేనప్పుడును పాఠశాలలకు బాలికల బంపెదరుగాని విద్య నేర్వవలయునని పంపుటలేదు ఇందుకు దగినట్టుగ ఉపాధ్యాయినిలును చాలవరకు జీవన వసతిలేనివారే ఉపాధ్యాయిని పదవియందుండుటచేత తనిఖీదార్లు వచ్చినప్పుడు ప్రార్థనావాక్యములచేత వారిని సమ్మతింపజేసి తమ యుద్యోగముల నిల్పుకొనుచుండిరిగాని బాలికల పూర్తిగ విద్యావంతురాండ్రనుగ జేయజాలకుండిరి.

ఇందునకు గారణము జనులు విద్యయందభిరుచిలేనివారగుటయే కనుక బాలికల తలిదండ్రులే బాలికల మూఢురాండ్రనుగ జేయుటకు హేతుభూతులగుచుండిరి. నూనెకర్చు పడుచున్నది. కాని పిల్లలు బ్రతుకుట లేదన్నట్లు మన ప్రభువుగారి ద్రవ్యము నష్టమగుచున్నదిగాని స్త్రీలు విద్యావంతురాండ్రగుట లేదు. సకల జీవరాసులకు జలము ప్రాణాధారమైనట్లు స్త్రీ సృష్టికి కారణభూతురాలు ఇందునకు నిదర్శనముగ గర్భధారణము గువరకు మాతవల్లనే పోషింపబడుచున్నారు కనుక దేశరక్షణమునకు మంత్రివలె, గృహపాలనమునకు స్త్రీ పోల్చ దగినది. రణరంగమున నుపకరణములెన్ని యుండినను యోధుడు వీరుడైనగాని శత్రుసంహార మొనరింపజాలనట్లు, గృహపాలనమునకు స్త్రీ విద్యావివేకముల గల్గినగాని బాలికలు విద్యావివేకము గలవారు కానేరరు గనుక మీరెన్ని సభల జర్పినను మీ సతీతిలకముల కధ్యక్షత వహించుటకు బంపినను, లాభములేదు. ముందు స్త్రీలను సంస్కరింప వలయును, మూఢురాండ్రగు స్త్రీలు త్వరలో విద్యయందభిరుచి కలవారిగ జేయవలయును నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము అమలుపరచిన మొదల తప్పక ప్రతిస్త్రీయు తన పిల్లను పాఠశాలకు బంపును ప్రతిపాఠశాల యభివృద్ధిగ నుండును ప్రతిబాలికయు విద్యావతియగును. అప్పుడు సంస్కరణములు ఫలోన్ముఖములగును నిర్బంధ ప్రాథమిక విద్యను మాతృభాషలోనే కరపుటమేలు స్వభాష స్వమాత వంటిది. తల్లి తనపిల్లల శారీరమానసిక, శక్తులనెరిగి సదా పిల్లల యభ్యుదయమును గోరి వర్తించుటయు, నీతిబోధ చేయుటయు భోజనాది కార్యముల సల్పుటయు చేయునట్లు స్వభాష మానవుని శిశుకాలములో భావ్యభ్యుదయమునకు సహకారియగును కనుక స్వభాషయందే ప్రాథమిక పరీక్షలో కృతార్థులగుటకు నిర్బంధ ప్రాథమిక పరీక్షకై చట్టనిర్మాణము చేయుడని దొరతనమువారిని ప్రార్థించినగాని ఈ శాసనము అమలులోనికి రానేరదు. ఈ యుద్యమము, గొప్పగొప్ప విద్యాశాఖాధికారపదవులందున్న దేశభక్తులందరికీ ధరించినగాని నెరవేరదు స్త్రీలును పురుషులుగూడ నేకీభవించి బాలికాపాఠశాలల గురించి కలుగుచున్న లోపములును ద్రవ్యనష్టమును విపులముగ మన ప్రభువుగారికి నివేదనపత్రిక బంపవలయును

# వితంతూద్వాహ సంతాన శాసనము

(ఆర్. వి కొడిమేల్కర్ గారు)

భర్తలుగల స్త్రీలు అన్యమతస్థులుగా మార్పబడుటకవకాశము లేదు. అనాథలేవరాన్వేషణార్థము తమ సంఘమును పరిత్యజింపవలసి వచ్చుచున్నది. నిస్సహాయులును, జవ్వనలును, అగు హిందూస్త్రీలు స్వసంఘమందుండియే పెక్కు సంకటముల పాలగుచున్నారు. హిందూసంఘమున, పునర్వివాహమున కాజ్ఞలేమిచే వ్యక్తిస్వాతంత్ర్య ప్రదాయికములగు ఇస్లాం, క్రైస్తవ, మతములే హిందూ అనాథలకు శరణ్యములగుచున్నవి. యీ రాష్ట్రములో గొంత కాలమునుండి జరుగు సంఘటనములీ క్రిందపొందుపరచిన మత స్వీకరణ ప్రచారక లేఖలను బాగుగా వీక్షించి గ్రహింపదగును. హిందూసంఘము పూర్వాచారబంధనములలో దగుల్కొని యుండుకాలము గతించినది. అధికజాతి వారమని విఱ్ఱవీగు దురహంకారభూయిష్ఠులగు స్వసంఘీయులచేతనే అనుదినము పీడింపబడుచుండు మాల, మాదిగ, చాకలి, మంగలి మొదలగు తెగలకు చెందిన సోదరులెల్లరు అన్యమతావలంబన మొనర్చి స్వతంత్రులై సుఖజీవనము చేయుచున్నారు. అట్టి నిదర్శనముల సంఖ్యాకములు గలవు. కేవల - పూర్వాచారపరాయణులగు హిందువుల మాటలను వినుచుండిన చో యిప్పటికి క్షీణించియున్న హిందూసంఘము కొన్నాళ్లకు నామరూపములులేక నశించి పోగలదు. అనాథలగు స్త్రీలకు పునర్వివాహమునకై తగినంత స్వేచ్ఛ యుండవలెననుటకు నిదర్శనలై స్వీయసంఘమందుండియు వారు చేయు దుష్కార్యములును, అన్యమతావలంబకులై వారు బడయు స్వాతంత్ర్యమును, యిందుకు తార్కాణములగును. యిట్టి స్త్రీలను కలిగియున్న సంఘమే బాధ్యతకలది తప్పగునుగాని యీసంఘమందున్న యనాథలు నిందాస్పదలు కాజాలరు.

శ్రీ దేశభక్త ధర్మవీర వామననాయకు గారు సెలవిచ్చినటుల ప్రభుత్వమునకు మతముపై అధికారముండకూడదను విషయము యెన్నడెగిసదికాదు. ఎలయన ప్రభుత్వసహాయములేని మతము నిశ్చయముగా గొన్నాళ్లకు నశ్నగిల్లును. దీనికి చరిత్రయే సాక్ష్యము. మతములయొక్క మూలతత్వమును పెకలించి వేయు శాసనము గావింపబడుటకు మాత్రమే, యిట్టి యాక్షేపణలు చెల్లునుగాని ఇక్కిలి సామాన్యములగు నిట్టి శాసనములవల్ల మతముకుగాని మతగౌరవమునకుగాని యేవిధమగు భంగము వాటిల్లజాలదు. పండిత కేశవరావుగారిప్పుడు ప్రవేశపెట్టబోవు చిత్తుశాసనము వలన సంఘమునకట్టి హానియుకలుగనేరదు గోప్పలాభకారియుకాదు అనవసరముగా నిది చిద్విమయమున్నకై ఘోరయుద్ధమొనర్పుట పాడిగాదు. యీశ్వర ప్రేరితముగు వైదిక ధర్మమునకు భిన్నముగాని విషయమే. ప్రజల సంస్కృతి యొకానొక ప్రభుత్వమునందు శాసన ప్రాబల్యము గాల్పినందుకు విచారింపబనిలేదు. వేదములు దైవదత్తములు. శాస్త్రములు ప్రభుసన్మానితములు మఱియు నవి అశాశ్వతమగుగారవమునే పొందజాలినవని చెప్పవచ్చును. యిక పురాణములు కేవలము కాంతాజనసమ్మతములే. పరస్పర వైరుధ్యములును పౌరుషేయములును, సంస్కృతములునగు శాస్త్రపురాణముల నాధారముగా గైకొని, వాగ్వాదములొనర్చి, విసిగి వేసారి, తుదకు పశ్చాత్తాపము నొందుటకంటె మరొక విచారకరమగు విషయములేదు. కాంతాసమ్మతములగు పురాణములను ధీరులును సత్యాన్వేషణపరులును, లెక్కజేయరని వేరుగ నునవి జేయ నక్కరలేదు. పండిత కేశవరావుగారు ప్రవేశ పెట్టిన చిత్తుశాసనము సామాన్యమగు విషయముతోడనే కూడియున్నది. సాంఘికముగా నిష్వల్పమగు' త్యాగ మొనర్చి ప్రతివారును దాని నామోదించుటయు అట్లు చేయజాలకున్న తటస్థభావముతోయుండి ప్రతికూలత్వమును ప్రకటింపకుండుటయే శ్రేయస్కరము. దయచేసి పాఠ మహాశయులీ దిగువ నుదహరించిన పదిలేఖలను శాంతచిత్తులై పఠించుటకు ప్రార్థింపబడుచున్నారు. అనాథుడగు పరమేశ్వరుడే "తాబట్టిన కుందేటికి మూడే కాళ్లను" పూర్వాచార పరాయణులకు సద్బుద్ధి ప్రసాదించుగాత!

లేఖ (౧)

బీదరు—నుండి

౨ రబీవుల్ అవ్వల్ ౧౩౫౧ హి.

ఆలీజనాబ్ మౌల్వీ అబ్దుల్ వహాబ్ సాహెబ్ అనదలీబ్. వాఎజ్ పత్రిక మొహతెమీంగారి సముఖమునకు. అస్సలాం అలేకుమ్

యీ ఫకీరు కొంతకాలమునుండి జాతీయసేవ యొనర్చుచున్నాడు మీపత్రికలు వినిపించిన ఫలితముగా గతశుక్రివారము నాడు (జన్వాడా) కస్బాలో నొకహిందూస్త్రీ ముసల్మాను ఆయినది. ఇస్లామీపేరు (సరీబి) అనిపెట్టబడినది. భగవంతుడు వీరికి క్షేమకరమగు ప్రతిఫలమును ప్రసాదించుగాక!

ఇట్లు-ఇస్లాం సేవకుడు

(సం) సయ్యదుమహబూబ్ బాదుషాఖాదరీ

## పత్రికా పరిచయము

### గృహలక్ష్మి సంక్రాంతి సంచిక

గృహలక్ష్మి సంక్రాంతి సంచిక కృతజ్ఞతతో వచ్చినది. ప్రతిసంవత్సరము పర్వదినమునకు ప్రత్యేక సంచికను ప్రకటించి హిందువుల పండుగల యుద్దేశ్యమును దెలుపుచున్న ఈ పత్రికా సంపాదకులు ప్రశంసనీయులు

త్రివర్ణచిత్రములలో శ్రీరాంగణ పాలకేమే యయ్యబూరుషుని బోల్కేహిబాబును దట్టమైన కత్తిళ్లను నక్కపాగయు" యను శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారి చంపకముతో సరిపోల్చిన ఎంతయో అందముగా కాన్పించుచున్నది సంభునేసరాలు కన్నులకు కట్టినట్టుగా నున్నది ఇతర చిత్రములు కూడ ఇందు గలవు

రమణమ్మ యను ప్రథమ వ్యాసము చదువరులకు ఉద్రేకులుగా నొచ్చుచున్నది సంక్రాంతి గురించి పలువురు సోదర సోదరీమణులు వ్రాసిన వ్యాసములు చదువరులకు నూతన విషయపరిచయము కలిగించును

లేఖ (౨)

గంగావతితాలూకా,నోలీ కస్బా, దారుల్ ఖజా దస్తరునుండి వ్రాయు మురాశిలా.

తారీఖు ౧౩ అర్దీబెహిస్తు ౧౩౩౯ ఫసలీ.

మింజానబు సయ్యదు అహమేద్ హుసేన్ షరియ్యత్ నాహ ఖిద్మతుషరీఫ జనాబ్ నవాబ్ సదరు యార్జంగ్ బహాదుర్ సదరుస్సుదూర్ సర్కారె ఆలి.

(మొకద్దమా)

నోలీ, కస్బాయందు మతసేవకుని నీతిబోధనల పర్యవసానము.

పైవిషయములో చేయునట్టి విన్నప మేమనగా, యీఇస్లాం సేవకుని నీతిబోధనలకు ఫలితముగా నోలీగ్రామ వాస్తవ్యులును, లింగాయతుశాఖకు జెందిన స్త్రీయునగు (శిరబవ్వ), ౮ రజ్జబు ౫౩ హి, సోమవారమునాడు సాయంత్రి నమాజు అనంతరము నోలీ మస్జిదులో హాజరుఅయ్యి ఇస్లాం దీక్షను గైకొనినది. ఆమెకు, (మొహియొద్దీన్ బీ) అనునామకరణము చేయనైనది.

ఇందలి యొకప్రతి మౌల్వీ అబ్దుల్ వహాబు సాహెబు అనదలీబు వాఎజు పత్రికాధిపతి గారికి ప్రకటనార్థము పంపనైనది. (ఖాజీసంతకము)

[సశేషము]

## గోలకొండ బుక్ డిపో

| | | |
|---|---|---|
| ౧ | క్షత్రియుల నిర్ణయచంద్రిక | ౧-౪-౦ |
| ౨ | పంచమోద్ధరణము | ౦-౮-౦ |
| ౩ | పంచముల చరిత్ర | ౦-౪-౦ |
| ౪ | భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౪-౦ |

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జడీకంటి రామశతకము ౩ బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కృష్ణాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములు ఉచితముగ నివ్వబడును. టపాల ఖర్చులు వేరు.

క్లాసుకు బాలియ్యతులు నూటికి రు ౩ లు,

గోలకొండ బుక్ డిపో
నాంప్లీ, త్రూపుబజారు హైద్రాబాదు దక్కన్

## బ్రాహ్మణ సుదర్శన హోటలు
**(Sudershan Hotel)**
అఫ్జల్ గంజు హైద్రాబాదు

విశాలమైనగదులు, పరిశుభ్రమైన రుచికరమగు భోజనము నగరమునకు మధ్య. ఆఫీసులు. కార్యాలయములు, వారశాలలు, మార్కెట్టులు బజారు మొదలగునవి అందుబాటులో గలవు. ఒకసారి దర్శించిన అన్నియు విశదము కాగలదు ధరలు అతిచౌక వెంటనే వివరములు కనుగొనుడు.

మేనేజరు

## గోలకొండ పత్రిక
### ఏజంట్లు

హైదరాబాదు

1 జి॥ ఆర్. మూర్తిరబ్బర్‌స్టాంపు మేకరు & స్టారిపేరర్ గౌలిగూడ

2 నా॥ గౌరీశంకరవర్మ రెసిడెన్సీబజారు

౩టి ధర్మయ్యాచార్యులుగారు భువనగిరి జిల్లానల్లగొండ

## డొంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వలన

బలహీనతను పోగొట్టును

బిడ్డలకు బలమునిచ్చి

సౌఖ్యము కలిగించును

ఒక బుడ్డీ వెల ౧ రూపాయి

పోస్టు ఖర్చులు ౯ అణాలు

ఎల్ల చోటుల యందును దొరకును

K. T, DONGRE & Co,
GIRIGAUM, BOMBAY

అమృతాంజనము డిపో వారి 1931

## అందమైన రంగుల క్యాలెండరు

సుప్రసిద్ధి చెందిన చిత్రకారులచే వ్రాయబడిన
సుందరి, (రెండు రకములు) మహాత్మాగాంధి
ప్రసిద్ధ చిత్రపటములు గలవి
క్యాలెండరు ౪ కి 0-6-0 12 కి 1-4-0 100 కి 9-8-0
పోస్టు ఖర్చు ప్రత్యేకము
ప్రస్తుతకు. వి. పి. చార్జీలు తక్కువతగులుటచే ఆర్డర్లు మొత్తము సొమ్ముతో సహా అడ్వాన్సుగా పనిలేక గడమూలముగా పంపకోరెదము
షరా, 50 క్యాలెండర్లు, అంతకుపైగా కొను వారు సగము సొమ్ము అడ్వాన్సుగాపంపుచు దగ్గరగల రైల్వేస్టేషను తెలుపవలెను,
బొంబాయి—,అమృతాంజనముడిపో—మద్రాసు.

## గోలకొండపత్రిక
త్రూపు బజారు హైద్రాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | | |
|---|---|---|
| | రు. | ౭—౦—౦ |
| అర్ధ | ,, | ౩—౮—౦ |
| విడి పత్రిక | | ౦—౧—౪ |

Printed and Published by G. Ramakrishna Reddy at Golakonda Power Press, Hyderabad, Dn. Editor K. Baliakishnareddy.